The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper for H. E. H. The Nizam's Dominions

# గోలకొండ పత్రిక

తూప్రబజారు, హైద్రాబాదు, (దక్కన్.)

ప్రతి సోమ, గురువారములు ప్రకటింపబడును

సం॥చందారూ ౬-౦-౦
అర్ధ ,, ,, ౩-౦-౦
విడి ప్రతిక ౦-౧-౦

GOLKONDA PATRIKA

HYDERABAD, Dn. THURSDAY 11-10-1934

1034.81

ప్రాతపత్రికకు వెలప్రత్యేకము

సంపుటము ౯ } శా.శ.౧౮౫౬ శ్రీభావనామసం॥ ఆశ్వీయుజ శు॥ 3 గురువారము ౬-౧-౪౪౪ఫ. { సంచిక ౪౩

## బంగారు భవిష్యత్తును గూర్చిన కొన్ని విశేషములు

బొంబాయి అక్టోబరు ౬:—

యూరపులో ప్రతిదేశమువారును మరల బంగారు నాణ్యమును నేర్పరుపగోరుచున్నారు. కాని అదియటుల జరిగిన ను ఇండియా కట్టేలాభమును కలుగదు. అప్పుడు వాణెములధర యింకను అధికమగును. బంగారుధరగూడ దాని కనుగుణము గానే యుండును. ఇండియానుండి యెటుపయినగూడ బంగారము విస్తారముగా ఎగుమతి చేయబడుచునేయుండును. ఇండియాలో బంగారము చాల విలువయున్నది గాన బంగారు ధర తగ్గదు" అని యూరపుదేశమున సంచారముచేసి వచ్చిన యొక భారతీయ అర్థిక శాస్త్రవేత్త తెలిపెను.

## గ్రామపునర్నిర్మాణ విధులు

లాహోరు, అక్టోబరు ౭:—

పంజాబులో గ్రామపునరుద్ధరణలో ప్రత్యేక విధులను నిర్వహించుటకు నియమింపబడిన కమిషనరు యఫ్. యల్. బ్రెయినుగారు ఆంగ్లమున అత్యవసర ముఖ్యాంశములనిట్లు సూచించుచున్నారు.

గ్రామమందలి అశుద్ధమంతయును వేయుటకు అచ్చటచ్చట గుంటలను త్రవ్వించి, అందులో మురికిని అప్పటికప్పుడే యెత్తించుచుండవలెను. అనుదినమును పల్లెలలోని వీధులను, గృహములచుట్టును, గృహములందును శుభ్రముగ నుండుటకు చిమ్ముచుండవలెను. బిడ్డలదేహములనేగాక వస్త్రములనుగూడ శుభ్రముగ నుంచవలెను. ఆరోగ్యపద్ధతుల బోధించి వానిని వాడుకకు తెచ్చునట్లు చేయవలెను. వాసయోగ్యమగు ప్రతిగదికిని రెండు కిటికీలుండునట్లు చేయవలయును. అప్పుడప్పుడు డేస్సినేటు చేయించుచుండవలెను. త్రాగుటకును పశువుల గడుగుటకును ఉపయోగించు నీళ్లనిలచు పల్లములనెల్ల చదునుపరచి పచ్చిక బయళ్లుగ చేయవలెను, అట్లు చేయుటచేత మలేరియాదోషము ఉత్పత్తి కాకుండును. గ్రామమునపడు నీరంతయు పారిపోవుటకు కాలువల నేర్పరుపవలయును. గోధుమలు, ప్రత్తి మొదలగువాని మంచివిత్తులు లభింపజేయవలెను. క్రొత్తవిధానపు వ్యవసాయపు పనిముట్లు వాడబడునట్లు చేయవలెను. మంచిపశువులను వృద్ధిపరచుటకు ప్రోత్సహించవలెను. బిడ్డలకు చెవులనుకుట్టుట, నగలను పెట్టుట, పెండ్లివేరంటములకు నిరుపయోగమైనట్టియు లాభకరము గానట్టిదియు అగు వ్యయముల తొలగించుట, కోర్టుకేసులకు పోకుండ చేయుట చాలముఖ్యము. ఆటపాటలయందభిరుచి కలుగజేయవలెను.

పల్లెలకేగాక పురవాసులక్షేమము అభివృద్ధిగూడ బాలికా విద్యాభ్యాసముపై ఆధారపడియున్నదని చూపవలసిన అవసరమున్నది.

పైకార్యములన్నియు నెరవేరవలయునన్న ప్రభుత్వోద్యోగస్థులు, విద్యావంతులు భూస్వాములు, ఐశ్వర్యవంతులు అందరును ఒకరితోనొకరు కలిసి పనిచేయవలెను.

## వ్యవసాయకుల కలహము

లాహోరు అక్టోబరు ౫:—

మణియవల్ల అనుచోట వ్యవసాయదారులలో రెండు పక్షములుగలవు చాలకాలమునుండి ఇరువురికిమధ్య, కలహములు చెలరేగుచుండెను. ఒకచోటునుండి పొలములకు నీరు చేరుటతో కలహము తీవ్రరూపముదాల్చి ౧౦ మంది జమీందారులు సాయుధులై దాగియుండి అవతలిపక్షమునకు సంబంధించిన నలుగురిమనుష్యులపైబడిరి.

వారిలో లంబార్దారుగారు పనిచేసిన ఆతనికొడుకు క్రొత్తగా మెట్రికులేషను ప్యాసైన గురుబక్ సింగు తల పగులుటవలన వెంటనే మరణించెను.

మిగిలినవారికి బలమగు గాయములు తగిలెను. వారిలో నొకడపాయస్థితిలోనున్నాడు.

# ప్రాతప్రిన్సిపాలునే ఉంచుడు

## ప్రభువుగారికి ఉస్మానియా విద్యార్థుల మహజరు!

పూర్వపు విద్యార్థులును, ఇప్పటివిద్యార్థులును చేసి యొక మహజరు [సంఘవిజ్ఞాపనము] ప్రభువుగారికి పంపుకొనినారు. దినమంతయు పనిచేయు ప్రిన్సిపాలు తమకుండవలయుననియు మాల్వీ-ప్రిన్సిపాలు ఉండవలయుననియు విజ్ఞాపనయొక్క సారాంశము.

మా, అబ్దుర్రహిమాను ఖానుగారిని ఇటీవల నిజాంకాలేజికి బదిలీచేసినందునకు యీమహజరు వెడలినదని తెలియుచున్నది.

### జన్మోత్సవపు క్రొత్తబిరుదులకై ఫర్మాను

మ. ఘ. వ. ప్రభువుగారు తమజన్మదినోత్సవ సందర్భమున అనుగ్రహించిన బిరుదులపట్టికలు ౩, ౯ జమాదిస్సాని ౧౩౫౭ హి. జి ఫర్మానుద్వారా వెడలినవి. ఈబిరుదులు యిదివరకుపత్రికలలో వచ్చినవేకనుక ప్రకటించతేదు.

### జన్మదినోత్సవపుదినము సెలవు

మ. ఘ.వ. ప్రభువుగారి జన్మదినోత్సవపు సెలవు ౬ ఆజారు ౧౩౪౮ ఫ గురువారమునాడుఅని ప్రకటింపబడియెను. కాని జంత్రీలోనిమార్పులనుబట్టి ౫ ఆజారు బుధవారమునాడే జన్మదినమని ప్రభువుగారి ఫర్మానుజారీఅయినది

### జన్మోత్సవపు విందు

ఈసారివిందు కింగ కోఠీలో గాక ఈడేనుతోటలో జరుగునట్లు ప్రభువుగారి ఆజ్ఞయైనది.

### మునిసిపలు ఎన్నికలవిషయమున సభ

దివాన్ దేవిడివద్ద మెజస్టిక్ సినిమా హాలులో ఉస్మానియా పట్టభద్రులసంఘము పక్షమున బహిరంగసభ జరిగెను. మీరఅహమ్మదుల్లాల సంఘమున కధ్యక్షుడగు హిసాముద్దీను సా॥ సభాధిపత్యమువహించెను. స్థానిక స్వపరిపాలనమున మొట్టమొదట దొరికిన పురపాలకసంఘ సభాసదత్వమునకు మనము యోగ్యతగలవారినే ఎన్నుకొనవలయును అని రాయ్ నారాయణప్రసాదు, సయ్యదు మహమూదుసా॥ మొదలగు పట్టభద్రులు ఉపన్యసించిరి.

### ఉద్యోగవిషయములు

**అబ్కారి మొహతమిం అధికారులు:—**

క్రొత్తగాకల్పింపబడిన యీయుద్యోగములపైన యీ క్రింది వారునియోగింపబడిరి:—

౧. గణేశ ప్రసాదుగారు ౨ సయ్యదు మహమూదుసా॥ ౩ నాషర్వాంజీగారు ౪. ఖాజా హమీదహమదుసా॥ సయ్యదు మహమూదుసా॥ ౬. మిర్జాజంగు బహదరుసా॥

**పురపాలకసంఘము:—**

క్రొత్తవాజము నవాబు జైనుయార్జంగుగారు చార్జి పుచ్చుకొనిరి

**సెలవులు:—**

నారాయణపేట మునసబు తాలుకుదారు ఒక సంవత్సరము సెలవుమీద వెళ్లుచున్నారు.

హాఫ్జి గులాం దస్తగీరు సా॥ మున్సఫ్ (బీదరు) గారికి ఆజారు ౨ తారీఖునుండి ౩౦ ఆజారు సన్ ౧౩౪౮ ఫ వరకు ౨౯ (దినములు) సెలవు మంజూరిఅయినది, వారిస్థానమున అల్యాసుఖాన్ సా॥ పనిచేయును.

రాజ ధర్మకరణ బహద్దరు అవ్వలుతాలుకుదారు అదిలాబాదుగారి సెలవు ఆరువారములు మంజూరైనది. ఆజారు ౨ తారీకు సన్ ౧౩౪౮ ఫ. నుండి ఆరంభమగును. వీరిస్థానమున అమీరలిఖాన్ సా॥ దువ్వంతాలుకుదారు [నిర్మల్] గారు పనిచేయగలరు.

---

యమీనుద్దౌలా ప్రిన్సుసాహెబ ఈరాసుగారికిజీతము

### ప్రభువుగారి ఉచితమైన ఏర్పాటు

ఈయనకు మ. ఘ. వ. ప్రభువుగారు నెలకు నూరురూపాయిల కల్దారు జీతము ఉచితముగా నిర్ణయించిరి' పేరునుబట్టి చూచినచో వీరు పరిషియాదేశస్థులు.'

### సీనియర్ హాలో ఆటలు

ఈ ఆటలు సికింద్రాబాదులో ౨ ఆజారునాడు చాల ఉత్సాహప్రదముగా జరిగినవి

### ప్రభుదర్శనము పొందుట

డాక్టరు సయ్యదు పజ్లానుసా॥ గారికి మ. ఘ. వ. ప్రభువుగారు దర్శన మొసగిరి.

### అదాలతుల పెద్ద ఇనస్పెక్టర్లు

వీరుఔరంగాబాదులోని అదాలతులను పరిశీలించుటకై వెళ్లియుండిరికదా వారు౩౦ఆబానాడు యచ్చటినుండి మరలిరి.

### మహమ్మదీయ ఐక్యాభివృద్ధి సంఘసభ

ఈసభ నగరమున ౧౫ఆబానాడు జరిగినది మతవిషయములును, తదభివృద్ధివిషయమునను మహోపన్యాసములు జరిగినవి.

### జూదమాడుచోట వద్దనిపికెటింగు

నగరములోపల ,,శెరటిషో 'అనునది ఆరంభమైనది అచ్చటికిప్రతిదినము వందలకొలది యువకులు వెళ్లి వీరత్యార్జితమైనద్రవ్యమును జూదమునందు పాడుచేయుచున్నందున ౪ ఆజారునుండికొందరు ఉత్సాహవంతులగు యువకులుపికెటింగు ఆరంభించినారు' ,,పికెటింగుఅనగా బలిమాలిదుష్కార్యములజేయువారిని అపనులనుండి మరలించుట.

### ఉస్మానియా విశ్వవిద్యాలయము

కాలేజులు దాదాపుఅన్నియును క్రొత్తమందిరములందు ౭ ఆజారునుండి పనిచేయుచున్నవి ఇంజనీరింగుకాలేజి ౨౦ ఆజారువరకుమర గలదు. విద్యార్థుల వసతిగృహములు హిందువులకొరకును మహమ్మదీయులకొరకును తెరువబడినవి. నవాబ్ హైదర్ నవాజ్ జంగు బహద్దురుగారును, మేకన్జిగారును వచ్చి చూచిపోయిరి.

### జన్మదినోత్సవము

౫ఆజారునాడు మ ఘ.వ. ప్రభువుగారి జన్మదినోత్సవ సంబంధమగుఅలంకరణములు పలుతావులజరిగినవి. సర్ఫేఖాసు సేనావిన్యాసముజరిగినది, ప్రత్యేకముగు కార్యక్రమమునను సరించి, సర్వసేనాధిపులగు యువరాజుగారు ఉత్సవములలో పాల్గొనిరి. బాలురసేనలు దివ్యము గాపనిచేసెను. విందులుజరిగినవి.

## మేకన్జిగారి ప్రయాణము

ఆగ్రావిశ్వవిద్యాలయ పట్టభద్రులకాన్వొకేషనుసభలో ముఖ్యోపన్యాసము నొసగుటకు మేకన్జిగారు ఆహ్వానింపబడినారు వీరుమనఉస్మానియావిశ్వవిద్యాలయమునకు ఉపకులపతులుఅనుసంగతి చదువరు లెరుగుదురు.

---

## సహస్రావధానము

హైదరాబాదు; ౧౦-౧౦-౧౯౩౮:—

నైజాంకాలేజి ఆంధ్రసాహిత్య సమితిపక్షమున నిన్న సాయంకాలము (౫ అక్టోబరు మంగళవారం సాయంత్రం ౪ గంటలు ౬ గంటలవఱకు) ప్రొఫెసర్ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమసహస్రావధాన కౌశలమును ప్రదర్శించిరి. ప్రొఫెసర్ శ్రీయుతు హనుమంతరావుగారు రధ్యక్షతవహించి తము నలంకరించిరి సభికులలో ముఖ్యులు ఉస్మానియాయూనివర్సిటి ప్రొఫెసర్ రణశోభ్ వీరభద్రుడుగారును, నిజాంకాలేజి ప్రొఫెసర్లు డాక్టరుజయంత కామేశ్వరరావుగారు వగైరాలు, రాజాపింగలి కోదండరామారెడ్డిగారు.

సరిగ వేయికార్డులమీద వేయివిషయములు వ్రాయబడియుండెను. ౫౦౦ రంగులబొమ్మలు, రెండువందలు సంఖ్యాసంబద్ధములు, రెండువందలు కావ్యవిషయములు సమస్యలు సామెతలు సప్తవర్ణములు (రంగులు)గల కొన్ని కార్డులుకొన్ని, ఇట్టి వేయువిషయములు జ్ఞాపకముంచుకొని కార్డుసంఖ్య చెప్పినవెంటనే విషయము చెప్పుచు తమ యద్భుత మేధాశక్తిని ప్రదర్శించిరి. సభికులు పరమానందభరితులైరి, ఒక బంగారుపతకము సమితివారు శాస్త్రిగారికి బహుమానము గావించిరి. కృతజ్ఞతావందనములతో సభముగింపబడెను.

ఇట్లు
యస్ విశ్వనాథశాస్త్రి,
అధ్యక్షుడు.

### రేడియో ప్రదర్శనము

౧ఆజారునాడు ఈయంత్రములు మూసీనది తోటలందును, జాగీర్దారుకాలేజి, వివేకవర్ధిని పాఠశాలయందును మరిపలుతావులందును పెట్టబడెను వేలకొలదిజనులు గుమిగూడి విని ఆనందించిరి.

### ఫుట్ బాల్ తుది మ్యాచ్

నవాబుసాలార్ జంగ్ బహద్దురుగారి యాజమాన్యమున ౨ఆజారుసాయంత్రము నిపోటీఆట జరిగినది.

### సికిందరాబాదు ప్లేగు హడావుడి

(ఒక విలేఖరి)

౧-౧౦-౧౯౩౮ నాడు బొలారంలో పి ఆర్ త్యాగరాజుగారు మరణించిరి వీరుహైదరాబాదులోని బ్యాంకరు అగు రఘునాథ్ మల్ గారి బ్యాంకులో సీనియరు అకౌంటెంటుగా పనిచేయుచుండిరి వారినయస్సు ౪౦యేండ్లు, గతివారము వరకువారు ఆరోగ్యముగా పోయిగానుండిరి ౫ రోజుల క్రిందమాత్రమే వారికికొంచెము బాగుండలేదట ౪ రోజులు వారికి జెంపిరేచిరు హెచ్చినెమోనియాఏర్పడి గుడకు మరణించిరి. వారుచాలా నమ్మకస్థులుగ నుండిరి, అభివృద్ధిచెందుచున్న బ్యాంకుకు వారివల యెంతో ప్రయోజనమున్నది.

### హైదరాబాదు తోటపనుల కోళ్ల ప్రదర్శనము

ఈప్రదర్శనము గతసంవత్సరము జనవరి మొదటివారములోజరిగెను యీసారిప్రదర్శనము సరిగా ఏతేదినాడు జరుగునది ౩నెలలు ముందుగా తెలిపినచో పోటీదారులకు అనుకూలముగనుండగలదు యీలోగా వారుకూరగాయలను,పండ్లను, పూలను, సరిగా పోషించుటకును,యింటిపక్షులను పెంచుటకును అవకాశముండును. అధికారులు దయయుంచి ఈ విషయము సరియైనతేదిని ముందుగా తెల్పగలరని నమ్ముచున్నాము.

### సికింద్రాబాదు ఆరోగ్య శిబిరములు

జనులలో అనేకులు భయపడుచున్నను ప్లేగు తగ్గుచున్నట్లుగానరాదు. పశ్చిమపు పెరేడు ఆరోగ్యశిబిరము నిండినది మారేడుపల్లి శిబిరము త్వరగానిండుచున్నది ఈ రెండవదానిలో నూర్లకొలది గుడిసెలున్నవి. ఇంకనుఅనేకములు కట్టబడుచున్నవి కంటోన్మెంటు అధికారుల పక్షమున కె. తాతాచారిగారు అందరికి భూములను పరచిపెట్టుచున్నారు. భయపడుచున్న జనులకు అనేక సౌకర్యములను చేయుటకై తాతాచారి యార్, బి. ఏ. బి. యల్ గారు రాత్రియనక పగలనక పనిజేయుచున్నారు క్యాంపులు పరిశుభ్రముగానున్నవి. కొఱవ యేమిగానిరాదు. ఆచారిగారు సీనియరు ప్లీడరుగానుండి చాలించుకొనుచున్నారు. వారు బీదలకు ప్రశంసనీయమైన సేవజేసినారు.

### రాకపోకలు

**కర్నులు క్రొంచుగారి దొరా**

వీరు సతీసుతసహితముగా ఔరంగాబాదు వెళ్లియుండిరి. ఎలోరా, అజంటాగుహాలన్నుచూచి ౧ఆజారునాడు తిరిగి స్వస్థానము హైదరాబాదువచ్చిరి.

గోలకొండ పత్రిక

శ్రీభావనామ సం॥ ఆశ్వయుజ శు॥ 3

గురువారము

## మ. ఘ. వ. ప్రభువుగారు

నిన్న మ. ఘ. వ. ప్రభువుగారి ర౯వ జన్మదినోత్సవము మహావైభవముతో జరిగినది. ఫతేమైదానమునందు అసఫ్‌జాహీ సేనలచే సమర్పించబడిన వందనములను ప్రభువుగారు గైకొనిరి నగరపోలీసువారిచే యొసగబడిన వందనములను ప్రభువరేణ్యుని తరఫున ప్రధానామాత్యులగు మహారాజా సర్ కిషన్‌ప్రసాద్ బహద్దర్ గారు స్వీకరించిరి. జిల్లాలలో గూడ ఈ మహోత్సవము ప్రజలకు సంతోషప్రదమైనట్లు క్రమముగ వార్తలు రాగలవు

ప్రభువరేణ్యుని జన్మదిన సమయమున సంప్రదాయసిద్ధమైన వట్టి బాహ్యాడంబరములచే కలుగునంతమాత్రమే గాక నిజమైనసంతోషమును ప్రజలకుయిచ్చుటకు గతసంవత్సరములో వలెనే ఈసంవత్సరములోను రెండుమూడు విశేషములు జన్మోత్సవమునకుముందు జరిగినవి గలవు.

ఒకటి మతములవిషయమున ప్రభు వరేణ్యుని ఫర్మాను. మఱియొకసారి ప్రభువరేణ్యుడు తమదృష్టిలో ఈరాష్ట్రమందలి అన్ని మతములును సమానమేననియు, మతవిషయములందు 'యిట్లుకాదు, యిట్లు' అని ఉపదేశించుటవరకే గాని, 'యిట్లేచేయవలెను' అని నిర్బంధముచేయుట సాధారణముగ తమపద్ధతిగాదనియు స్పష్టము జేసిరి. మతవిషయము లందు ప్రభుత్వము వారనవసరముగ జోక్యముకల్పించుకొనుటతగదని ప్రజల యభిప్రాయము గనుక ప్రభువుగారి ఈ ఫర్మాను ప్రజలకు ఒకగొప్ప సంతోష విషయము.

మఱియొక విశేషమేమన, తృతీయాంధ్ర మహాసభ జరుపుకొనుటకు అనుమతి లభించుట. ఇదిముఖ్యముగ ఆంధ్రులను మ. ఘ. వ. నిజాం గారి పాలనమువల్ల కృతజ్ఞతాబద్ధులను జేయుచున్నది. తృతీయాంధ్ర మహాసభ జరుపుటకు ఏర్పాట్లనుచేయు సంతోషములోనుండు ఆంధ్రుల కిప్పుడు ప్రభువుగారి జన్మదినోత్సవ సంప్రాప్తి ఆసంతోషము నినుమడింపజేయుచున్నది.

మూడవవిశేషము కొంత అసంతృప్తి జెందిన ఒకమతమువారికి తృప్తికలిగించుట. ఆర్యసమాజీయులు తమమతప్రచారమునకు ఆటంకములున్నవేమోయని సంశయించుచు భయపడుచుండ, మ. ఘ. వ. నిజాంప్రభుత్వము వారిఅట్టిసంశయమును నివారించుచు ఇతర మతస్థులకు లేని ఆటంకములు ఏవిగాని ఆర్యసమాజీయులను ప్రత్యేకముగ బాధించుటకై కల్పించబడలేదని ఒక ప్రకటనద్వారా స్పష్టముజేసిరి. ఇదియు సంతోషమైన విషయము.

ఇవిముఖ్యవిశేషములు, ఇంకను యితరములు ముల్కీగౌరవము నిల్పుట మొదలగునవి ఇటీవలనే ప్రభువరేణ్యుని అనుగ్రహముచే జరిగియున్నవి. ప్రభువుగారిమనుమని జననోత్సవానంద మనుభవించిన మఱునాడే ఆనందదాయకమైన ప్రభువుగారి ర౯వ జన్మదినోత్సవము సందర్భమున అసమాన రాజభక్తిపూరితులగు ఆంధ్రులందరితోపాటు మేమును ఈరాజ్యమునకు ఇతోధిక మహదైశ్వర్యమును ప్రజలకు సంతృప్తియు సమకూరుటద్వారా ప్రభువుగారికికూడ సత్యమైన సంతోషమును, చిరాయువును కలుగుటకై భగవంతుని ప్రార్థించుచున్నాము.

—

### నిజమైనచో ఒక అవకాశము తప్పినది

నిన్నటిరోజు హైద్రాబాదు బులెటినుపత్రికలోని యొకవార్తయందు విద్యాశాఖాధ్యక్షులు ఎచ్. యస్ యల్ సి. పరీక్షకై విద్యార్థులను తయారుచేయు పాఠశాలలకు ఒక సర్క్యులరును పంపించినట్లును, అందులో ఇప్పుడున్నటులే ఇంగ్లీషుద్వారా విద్యనేర్పుపద్ధతియే ఉంచుట మంచిదా, లేక మాతృభాషలో విద్య నేర్పుట మంచిదా, మాతృభాషలో నైనచో ఏమాతృభాషలో అని ప్రధానోపాధ్యాయులకు ప్రశ్నలు వేయబడినట్లును ఉన్నది. అనేక పాఠశాలల నుండి మాతృభాషలలో నేర్పవలసిన విధమునకై తొందరపడవలసిన పనిలేదనియు, యిపుడుండు పద్ధతినే యుండనీయవచ్చుననియు జవాబులు వచ్చినవట.

ఈవార్త నిజమైనచో చిత్రము. మంచి అవకాశము జారవిడువబడినట్లే. అడిగినను పెట్టని ఈకాలములో, పెట్టువారే కావలెనాయని విచారించునప్పుడు 'ఎందుకులే' యని యెవరైనను ఉపేక్షింతురా? మాతృభాషయని సమాధానమీయబడినచో కష్టమేమి? తెలుగుప్రాంతములోనుండు పాఠశాలలలో తెలుగుద్వారాను, మహారాష్ట్రప్రాంతములోనుండు పాఠశాలలలో మహారాష్ట్రముద్వారాను విద్యనేర్పుటకష్టమా?

నిజముగా ఈవార్తయంతయు సత్యమైనచో, అడుగబడినవారి పొఱపాటే యనవలసి వచ్చును.

—

## శ్రీనిజాముగారి సాల్గిరా
## జులూసు ఖమ్మంమెట్టు

సభామంటపమున గావింపబడిన ప్రార్థన

—

(పంచరత్నములు)

సీ. శ్రీరమణీయమై శోభ మాళవమునదేశీయ
సంస్థానపతియౌ నైజాముప్రభువు
దక్కనుప్రజలకు ధర్మసంస్థాన
జనహితతండ్రి నైజాముప్రభువు
విశ్వవిద్యాలయ విజ్ఞానతేజస్సు
సర్వసంధాత నైజాముప్రభువు
ఐశ్వర్యాదులందు నైశ్వర్యఘనకీర్తి
సాధుశ్రేణుల నైజాముప్రభువు

గీ. అట్టి మీరు ఉస్మానలీఖాను ప్రభువు
జన్మదినసంబు ప్రజలకు సంతసంబు
వేలవేలేండ్లు వర్ధిల్లవిశ్వమయుని
ప్రార్థనంబుల సల్పుచు ప్రస్తుతముగ

సీ. రాజమాన్యలబ్ధీయ రాజకీయోద్యోగ
స్వపరిపాలనము సంస్థానమునకు
ముల్కీప్రముఖ్యుల ముఖముచే దేశీయ
శాంతిసమ్మతము సంస్థానమునకు
రైతులబ్ధులమాట రచ్చతృప్తిగలిసిస్తు
సందేశస్థాయి సంస్థానమునకు
ప్రభువుకవిత్వ సంప్రాప్తప్రబోధంబు
సర్వసమ్మతము సంస్థానమునకు

గీ. స్వర్గమునకన్న మిన్నభూ స్వర్గమనగ
హైదరాబాదు రాష్ట్రపఠంపగనగ
మీరు ఉస్మానలీఖాను గారికాలు
ధనముగాలిదు ఘనతనొందు ధర్మమూర్తి

సీ. రాజప్రతినిధి శ్రేష్ఠులు ప్రభువ్రాక
హైదరాబాదు సన్మానమును
ఆర్యసమాజ సంఘాభిమానులకొర్కు
నాదరప్రచుర సన్మానమును
ఆంధ్రమహాసభ కొంతలభించిన
హైందవాంధ్రుల సన్మానమును
దేశగౌరవదీక్ష దేశీయయుద్యోగి
నాదరించినది సన్మానమును

గీ. నేటిసత్సరమందెయౌ నేర్పుకాంతి
పాలనంబును ప్రభుకీర్తి ప్రజలెరుంగ
ఇంద్ర పరిపాలనంబవ లేదియొసాటి
సమ్మతింపరే ఇండియాపార్థముగ

సీ. ఖమ్మముసాల్గిరా గౌరవంబునుమూడు
వత్సరంబులనుండి వరుసతెలుప
ప్రభువులకృషియందు ప్రజలసంతోషంబు
ప్రభుభక్తి స్తుతులను వరుసతెలుప
రాజభక్తికితవ రాష్ట్రమెల్లెడలందు
స్మరణీయయుతమైన వరుసతెలుప
క్రమపద్ధతిపలాను గౌరవస్తోత్రంబు
ప్రభువుకర్పించెడు వరుసతెలుప

గీ. జన్మదినమైనసాల్గిరా సమయమందు
భక్తివిశ్వాసమొదవు ప్రపక్తి తెలుప
దేశమునకును రాష్ట్రసంతృప్తి, ప్రభువు
గౌరవంబులస్తుతిదెల్పు కొఱమిదియె

సీ. ఆచంద్రతారార్క మాయుష్యసత్కీర్తి
యైశ్వర్యసంపద లలరుగాక
పుత్రపౌత్రులవృద్ధి పూర్వపుణ్యఫలంబు
ద్విగుణీకృతంబుగ తెలియుగాక
లోకవిఖ్యాతి ముల్లోకపరిచితము
కలకాలమునయందు కలుగుగాక
పరమేశ్వరునికృప వంశాభివృద్ధియు
పరిపాలనంబును ప్రబలుగాక

గీ. మీరు ఉస్మానలీఖాను మేలుగోరి
దేవుడీయంగ ప్రార్థింతుదినదినంబు
దైవసుయైన నైజాముధర్మమహిమ
స్తుతిని గ్రామాధికారి ప్రస్తుతము సెంతు.
"మీరు ఉస్మానలీ బాదుషాకి జై"

ఖమ్మంమెట్టు
౫-౧౧-౮౮ ఫ

ఇట్లు
వనం వెంకటనరసింహారావు

—

## దేవరకొండవార్తలు

—

### మరమ్మతులు

—

సడకు రిపేరులు, సడకుప్రక్కన పొట్టానాలుకట్టుట మొదలగు పనులు ... దర్గాసమీపమున కోనేరు వాల్గుప్రక్కన ... కట్టడము మొదలైనపనులు అందాజా మూడువేల రూపాయలవి లోకల్సుండునుంచి జరుగుచున్నవి.

### ఉరుసు

ఇచ్చట రెండుదర్గాలుకలవు పైనచెప్పినదికాక సలేమాన్ సాహెబ్‌దర్గా యొకటి యున్నది రెండుసంవత్సరములనుండి పెదటిదర్గా ఉరుసు మహావైభవముగా చేయుచున్నారు. దీనిలో హిందువులు మహమ్మదీయులు, మతభేదములేక సహాయము చేయుచున్నారు దీనివలన మనరాజ్యములో కలహిందూమహమ్మదీయైక్యత స్పష్టమగుచున్నది

### కాలమానము

వర్షము చాలస్వల్పము. పునాసయించుమించుగా రెండిండ్లవంతు పండెగలను అముదపుచేన్లు యింతవరకు బాగుగనే యున్నవి ఇకముందు వర్షముపడినయెడల ఆర్థపంట వచ్చుఫలించును వర్షముకై నిరీక్షించుచున్నారు రైతులస్థితి చెడిపోయినది

### సంత

ఇచ్చట ఆదివారమునాడు సంతజరుగుట ముప్పదిసంవత్సరములనుండియున్నది ఆనాడు కొత్వాలిపటేలు, నాకేదారు, మజ్కూరు. "ఫస్కీ" అనేపేరుతో ధాన్యములండిలకొక్కటికి సేరునుండి పావుసేరువరకును ఇవిగాక మిరపకాయలు, ఉల్లిగడ్డలు, చింతపండు మొదలగునవి బండికిరక్కెడుచొప్పునను వసూలుచేయు చెడ్డవాడుకగలదు. వసూలుచేయునప్పుడు జరుగుసంఘర్షణను చూచువారికిచాలబాధగానుండును ఆ ఆదివారమునాడు సంతకునిక మౌల్వీమహమ్మదు మొహియద్దీను సా॥ ముంతజము గారువచ్చి ఈ ఫస్కీపద్ధతినాపెదని టిట్టపరచి ఆపివేసిరి

ఇదిగాక మొండిఫక్కీలు వర్తకులను పీడించుచుండుట్టి ధాన్యము వసూలుచేసికొనుపద్ధతిని ఆనాటినుండి ఆపుచేసి దూరగ్రామములనుండివచ్చు వర్తకులకు ఎంతోసహాయముచేసిరి. ఆ

...నానాటెంత నూటికిగంతంతున సుంకమువిధింపబడుచున్న ది.భారతదేశమునచా నెలపరిశ్రమ అభివృద్ధి గాంచవలెననిన, కొయ్యపైసుంకము విధింపకుండవలెనని భారతవర్తకసంఘ కార్యదర్శిటారిపుకోర్డు కార్యదర్శికివిన్నవించిరి

— —

## బర్మాఇండియా వర్తకపు టొడంబడికకై యత్నములు

— —

రంగూను, అక్టోబరు ౫. —

బర్మా ఇండియానుండి విడిపోకముందు ఇండియాతో వర్తకపు టొడంబడిక కుదుర్చుకొనవలెనని బర్మావాణిజ్యమండలి ప్రతినిధియగు ఎమ్. ఆర్ పోర్చుగారు, జాయింటు సెలెక్టు కమిటీయెదుట సాక్ష్యమిచ్చుచు తెలిపియుండిరి.

బర్మా ప్రభుత్వమువారితో యొడంబడిక కొరకిప్పుడు గట్టిప్రయత్నములు సలుపుచున్నారు వర్తకపు ప్రతినిధులతో సంభాషించుచున్నారు నవంబరులో ఇండియానుండి యిచ్చటకువచ్చు స్పెషల్ ఆఫీసరుతో బర్మాప్రభుత్వమువారు సంప్రదింతురు

ఆయవ్యయపట్టికను సరిచూచుటకు అవసరమైనయెడలనే బర్మావస్తువులపై సుంకములు విధించుటవసరము బర్మాలోనికివచ్చు ఇండియాదిగుమతులపై బర్మావారు కొన్నిసుంకములను విధింతురని యూహింపవచ్చును

ఇప్పుడు బర్మా ప్రభుత్వమువారు, ఒడింబడిక కొరకు సేకరించుచున్న వివరములు బహుశః జాయింటు సెలెక్టుకమిటీనారియెదుట పెట్టబడవచ్చును

— —

# మహాత్ముడు నాయకత్వము వదలిన భారతజాతికి నష్టము

— —

### డాక్టరు రవీంద్రనాథ టాకూరుగారి అభిప్రాయము

— —

కలకత్తా అక్టోబరు౨ —

పరిధానవిషయములలో నాకును మహాత్మునకును భిన్నాభిప్రాయములు కలవు. గాని మహాత్ముడు కాంగ్రెసునాయకత్వమును వదలినచో కాంగ్రెసువారిలో విభేదములు చాల అధికమగును కాంగ్రెసుయొక్క నైతికబలమును, గౌరవ ప్రతిష్ఠలును విపరీతముగా తగ్గిపోవును కావున మహాత్ముడు తొందరపడి నాయకత్వమును వదలగూడదు"

గాంధిమహాత్ముని గౌరవించుటకు మహాత్ముడు చెప్పిన ప్రతిపనిని మనమందరము చేయవలసిన అవసరము లేదు" అని నేను శాంతినికేతనమున గాంధివర్ధంతిమహోత్సవమునాడు సభలో తెలిపితిని వీమలుకోనిది విపరీతార్థమిచ్చునట్లు ప్రకటింపబడెను ...

మనుష్య జీవితధర్మములు, ముఖ్యము అగు రాజకీయ సాంఘిక విషయములు వీటినిగూర్చి నాకును మహాత్మునకును అభిప్రాయభేదము గొప్పదేకాని భారతదేశీయులకు నిజమైన రాజకీయ జీవితమును యిచ్చినవాడు మహాత్ముడే యనుటకెట్టి సంశయములేదు మహాత్ముని జీవితోద్దేశ్యము పూర్తియైనదని గాని లేక ప్రయోజనము ముగిసినదనిగాని తలచుట మిక్కిలి గొప్పపొరపాటు ఇట్టి విషమస్థితిలో ఈకాలమున మహాత్ముడు నాయకత్వమును వదలినచో భారతజాతియంతకు మహానర్థము కలుగును" అని రవీంద్రమహాకవి తెలిపినాడు

— —

# జపాను ఇండియా ఎగుమతి హెచ్చుట

— —

### జపానుప్రత్యేకమైన ఏర్పాట్లకైఇండియానుకోరుట

— —

సిమ్లా అక్టోబరు ౬ —

ఆగస్టుమాసము ఆఖరునకు జపానువారు భారతదేశపు ప్రత్తిని ౯ లక్షల బేళ్లనుకొనిరి ఇండోజపానుసంధి ననుసరించి జపానువారు ఒకసం॥లో ౪౦ లక్షలగజముల వస్త్రములను ఎగుమతి చేయవచ్చును అందుకుగాను వారు ఇండియాలోని ముడిప్రత్తిని కొనవలెనియున్నారు వారిప్పుడు ౹౦ లక్షల బేళ్లను అధికముగనే కొనియున్నారు. అధికసంఖ్యరాగల సం॥వరకు వారికి జమచేయబడును' ౧౯౩౪ సం॥సెప్టెంబరుతో ముగియు అర్ధసం॥లో (వస్త్రములసంబంధమైన సం॥) ౩౪ లక్షల గజములగుడ్డను జపాను ఎగుమతిచేయజాలకపోయినందులకై భారతప్రభుత్వమునకు మనవిచేసికొనియుండెను అందులకు జవాబుయింకను యివ్వబడలేదు సమాధానముప్రకారము రాగల అర్ధసం॥లో నూటికి ౧౦ వంతున జపానువారు ఎక్కువగ ఎగుమతిచేయుదురు కావున మొత్తముఎగుమతిలో ౧౪ లక్షల గజములుమాత్రమే తక్కువపడును గాన అందుకు ప్రత్యేకపుసౌకర్యములకై ఉత్తరువుల నివ్వవలసినదని జపానువారు భారతప్రభుత్వమునుకోరుచున్నారు, జపానులో సంబంధించిన ఈ స్థితిగతులను గమనించి, జపానువారిపట్ల దయయుంచి, భారతప్రభుత్వము మొదటివర్తక ఖరారునామాలో కొన్నిమార్పులను అంగీకరించవచ్చును.

— —

# బొంబాయి నేతపరిశ్రమ

— —

### తిరిగి వృద్ధిజూపుట

— —

బొంబాయి అక్టోబరు౨ —

మధ్య కొంచెముహీనముగ నుండినబొంబాయి నేతపరిశ్రమ యిప్పుడుమరల తలయెత్తుచున్నది ఇప్పుడుమిల్లులలో పనివారలసంఖ్య పూర్తిగానున్నది అనేకమిల్లు లహోరాత్రము లు పనిచేయుచున్నవి రాత్రిపనిచేయువారి సంఖ్యగూడ పూర్తిగ నేయున్నది. ఇటీవలజరిగినసమ్మె విఫలమగుట, జీతములకొక నిశ్చితవిధాన మేర్పరచుట, తాతాకంపెనివారు పవర్ ఖర్చులను తగ్గించుకొనుట ఇంకను ఇత్యాదిసత్కారణములవలనను మరల బొంబాయిమిల్లులు అభివృద్ధిపొందగల పరిస్థితులేర్పడినవి వచ్చేయేటికి సప్లైచేయుటకు కాంట్రాక్టులనుగూడ కుదుర్చుకొనియున్నారు. చాలకాలమునుండి అమ్మకములోలేని క్రొత్తనేతరకములుగూడ తయారుచేయబడుచున్నవి

— —

### పటేలుగారి ఉపన్యాసములో కమ్యూనిస్టుల అల్లరి

— —

అహమదాబాదు, అక్టోబరు 3 —

నేడు మధ్యాహ్నము జరిగిన రాష్ట్రీయ కాంగ్రెసుసంఘసభలో వల్లభాయిగారు ఉపన్యసించిరి

వార్ధాలో భారతికాంగ్రెసు కార్యసంఘమువారు నిర్మాణవిధానమును సాంఘిక పరిష్కారమునుగూర్చి చేసిన తీర్మానములు. సభలో నామోదింపబడెను

### కమ్యూనిస్టుల అల్లరి

నేడు సాయంకాలము బహిరంగసభలో వల్లభాయిగారుపన్యసించుచుండగా కమ్యూనిస్టులు అల్లరిచేసిరి. "గాంధియును వల్లభాయియును మిల్లుయజమానుల పక్షపాతులు" అను కరపత్రములను వారు పంచిపెట్టిరి ఒక కరపత్రమును వల్లభాయిగారికిచ్చిరి "నాకును మహాత్మునకును సంస్థానాధిపతులు భూస్వాములు మిల్లులయజమానులు మున్నగువారియందింకను నమ్మకముకలదు మనము స్వరాజ్యము బడయవలయునని దేశమునందున్న అన్ని తెగలవారినికూడ గట్టుకొనిరావలెను"అని వల్లభాయిగారు నుడివిరి వల్లభాయిగారు ప్రత్యుత్తరమిచ్చుటకవకాశమియ్యవలెనని కమ్యూనిస్టులు తెలిపిరి, వల్లభాయి గారి ఉపన్యాసము ముగియువరకును వారు అల్లరిచేయుచునే యుండిరి పిమ్మటవారు వేదికపైకివెళ్లి మాటలాడగోరిరి కాని సభ్యులు కేకలువేయుచుండుటచే వారు వెడలిపోయిరి.

— —

### సింహళ వ్యవసాయ కళాశాల

— —

కొలంబో అక్టోబరు౩ —

కొలంబోకు౭౦మైళ్లను సింహళములోపర్వతప్రధానపట్టణమగు కండికిస్వల్పదూరమునన్న పెరడేనియాలో వ్యవసాయకళాశాలను స్థాపింప సింహళప్రభుత్వము తగుప్రయత్నములుచేయుచున్నది

వ్యవసాయడైరెక్టరు దానిస్థాపనకై ఒక నియమావళిని సిద్ధపరచుచున్నట్లు తెలియుచున్నది

— —

# తుంగభద్రా ప్రాజెక్టు తగాదాలోఇండియా ప్రభుత్వపు మధ్యస్థము

— —

మద్రాసు, అక్టోబరు౨ —

తుంగభద్రానదిలోని నీటిని ఉపయోగించుకొనుటకై మైసూరుప్రభుత్వము వారికిని మద్రాసుప్రభుత్వము వారికిని నైజాముప్రభుత్వము వారికిని, బొంబాయి ప్రభుత్వము వారికినిహక్కు కలదు.

కాని,హొస్పేటవద్ద మద్రాసుప్రభుత్వమువారును నైజాముప్రభుత్వమునుకలిసి ఆనకట్టనునిర్మించుటకు నిశ్చయించిరి. మైసూరుప్రభుత్వము వారుఎగువను ఇంకొక ఆనకట్టు కట్టదలచియున్నారు మైసూరుప్రభుత్వమువారు ఎంతనీటిని ఉపయోగించుకొనుటకు హక్కుదారులు అనువిషయము నిర్ణయించుకొనుటకై మద్రాసు,మైసూరుప్రభుత్వాధికారప్రతినిధులు బెంగుళూరులోసమావేశమై చర్చించిరి, కాని మైసూరుప్రభుత్వమువారు తాము తీసికొనదలచిన జలప్రమాణమును తగ్గించుటకు వీలులేదనిభీష్మించిరి. అందువల్లసమాధానముకుదరక ఈతగాదాఇండియాగవర్నమెంటువారికి నివేదింపబడునని తెలియుచున్నది ఇరుపక్షములు సమాధానపడి ఏదోవిధముగా ఏర్పాటుచేసుకొనవలసినదిగా ఢిల్లీప్రభుత్వమువారు ముందుగా కోరగలరు అలాగువరస్పరము రాజీకిరానియెడల ఇండియాగవర్నమెంటువారే తమకుయుక్తమని తోచినరీతిని ఉభయప్రభుత్వములెంతెంతనీటిని వాడుకొనవచ్చునో నిర్ణయింపగలరట

మైసూరురాష్ట్రములో కావేరీనదీజలమును విద్యుచ్ఛక్తియుత్పత్తిచేయు నిమిత్తమై మైసూరు ప్రభుత్వమువారుపయోగించుకొనుచున్నందులకై మద్రాసుప్రభుత్వంవారికి కట్టవలసిన కప్పముయొక్క మొత్తమును నిర్ణయించువిషయములోకూడా ఉభయపార్టీలు రాజీకరాలేదు ఈవిషయములోకూడా ఢిల్లీ ప్రభుత్వమువారే మధ్యవర్తులై తీర్మానముచేయగలరట

— —

# కడపటి వార్తలు

హైదరాబాదు శాసన సభవారు హిందూవితంతు వివాహ చిత్తుశాసనమునుగూర్చి ఆలోచించుటకై రాబోవు ౧౩౪౪ సాలు ఉదయము ౧౧గంటకు సమావేశమగుదురు

— —

సంవత్సరముక్రింద వెలివేయబడిన, బొంబాయి "క్రానికలు"పత్రికపై నిషేధమును మ.ఘ.వ. ప్రభువుగారు దయతో తీసివేసినారు

— —

# బీ. హనుమంతరావుగారి నిరంకుశాధికార సమాప్తి

## యాదగిరిగుట్ట కమిటీ

(విలేఖరి)

కుమారు సంవత్సరమునుండి విఖ్యాతమగు నీదేవాలయము ఏర్పాటులు బాగుగాలేవని సర్కారులో షికాయతులు జరిగియుండెను. షికాయతుల హనుమంతరావుగారి మన్సరి పాలనను గూర్చి అవ్వలుతాలూకుదారుగారు సక్రమముగా విచారణచేసి దేవాలయముయొక్క ఏర్పాటులు హనుమంతరావుగారి నిరంకుశ పరిపాలనములోనుండుట అక్రమమని నిర్ణయించి, దీనిని కమిటీస్వాధీనపరచుట యుచితమని నాజిము సాః ఉమూరె మజహబికి వ్రాసిరి కాని హనుమంతరావుగారు ఉమూరె మజహబిలో మాటిమాటికి దరఖాస్తులిచ్చి ఆటంకములు కలిగించుచు ఆలస్యము జరుగు ప్రయత్నములు సల్పుచుండిరి. తుదకు యీవిషయము సాకల్యముగా పరిశీలించి మన ప్రధానమంత్రి మహారాజా సర్ కిషన్‌ప్రసాదు బహద్దరుగారు మురాశిలా నిషాన్ ౧౬౨ తా॥ ౨౬ ఆబాన్ ౧౩౪౩ ద్వారా ఇట్లాజ్ఞాపించిరి —

.......... .......... .......... ..........

విచారణలేకుండ, కమిటీ ఏర్పాటుచేయుట అన్యాయమని ముశాను ముతవల్లినవియు హనుమంతరావు వకీలుద్వారా యిచ్చిన దరఖాస్తుపయిన మిసలు పరిశీలించనైనది జిల్లాలో అయినను, ఆయనపైన షికాయతుచేసినవారిని విచారించి, దేవాలయమును పరిశీలించినతరువాతనే కమిటీ అవసరమని, తాలుకుదారుగారు వ్రాసిరి దానికి హనుమంతరావు తన అంగీకారము తెల్పి దస్కతుకూడ చేసియుండెను ఆయన వకీలు దస్కతుకూడ కలదు కనుక హనుమంతరావుమాటలు తప్పు, అబద్ధము అట్లయినప్పటికిని అయనకు మరల అవకాశ మిచ్చితిమి సమాధానము ఆయనమాకు కలిగించజాలకపోయెను కనుక కమిటీ ఏర్పరుపనైనది. దేవాలయమున కస్సంబంధమైన ఆస్తిని రిజిష్టరు అవఖాపులో వ్రాసికొనవలసినది

.......... .......... .......... ..........

పైయంశములతో హుకుము వల్లగొండె అవ్వలుతాలుకుదారుకు పోయినది కనుక హనుమంతరావుగారి నిరంకుశప్రభుత్వము సమాప్తి' కమిటీమాట జరుగును' శ్రీమద్రమారమణ గోవిందోహరి' శ్రీయాదగిరి నరసింహస్వామికి జై" దేవాలయ కమిటీకి జై!!!

---

## సొంతయిండ్లు కిరాయయిండ్లతో సమము

### అందోలు గ్రామస్థుల మొఱ

[విలేఖరి]

అందోలు భావ సం॥ భాద్రపద బ॥ ౧౧ —

ఇది మెదకుజిల్లాలోచెరిన యొకతాలూకా గ్రామము, ఇచ్చట ఐదుసంవత్సరములనుండి గోషినిపట్టి యేర్పాటైనది ఈ సంవత్సరము మరల రివిజన్ అయినది పన్నులు చాలావరకు హెచ్చించబడినవి సన్ ౧౩౪౪ సాలునుండి రివిజన్ ప్రకారము వసూలుచేయబడును యిక్కడ గోషినిపట్టి కానూనుకు విరుద్ధముగ విధింపబడినది మొత్తము మసంఘమూరి విచారించగ యేదువండలలోపుగ ఖానాషుమారికలను జన బాహుళ్యములేను గ్రామమువారు గోషినిపట్టివిధించుట యక్రమము కనుక తొలగించవలయుననియు లేనిచో మరలరివిజన్ కావలయుననికోరి జిల్లాకు సుబాకు మాలుగుజారికి దరఖాస్తుపంపుకున్నారు ఫలమేమి తేలునో చూడవలయును ఇచ్చట కొండెంగు మెందు వర్షకాలములో కూనదొడ్లు (ఇండ్లు) నవరించుటకు దాదాపు పదిరూపాయాలపైన యగును గోషినిపట్టి విధింపబడినచో తాముకట్టుకున్న యిండ్లు కిరాయలవున్నట్లుఅవును

#### పంటలు పశువులవ్యాధి

అందోలుప్రాంతమున పశురోగమచ్చటచ్చటగలదు. పశువులుచాలావరకు నష్టమువుచున్నవి పునాసపంటలు సామాన్యముగనున్నవి వర్షకాలపుపంటలు పూర్తి చెరువులలోకి నీరువచ్చినది

---

## జనగాము రైతులపై పన్ను భారములు

[విలేఖరి] జనగాం —

జనగాములో ౧ అణాను సన్ ౧౩౪౪ ఫస్లీనుండి [illegible] క్రొత్తపన్ను

తులు అవలంభించినారు అనగా సన్ ౧౩౪౩ ఫస్లీలో బండికి రెండణాలుండెను, ఇప్పుడు [౮]అణాలుసవారికచ్చడము నకుకూడా [౮] అణాలు గుర్రమునకు సైకిలుకు ౧ అణా నెలిమాటకుఅర్థణా మోటారుకు ౮ అణాలు వసూల్ చేయుచున్నారు ఏపన్ను హెచ్చినను ఏపన్నువచ్చినను బీదవ్యవసాయకుడు బలి

### వర్తకము

సైగ్రామము వర్తకస్థానము రైల్వేస్టేషన్ కావునదినమునకు వేలబండ్లు వలుదిక్కులనుండివచ్చును బండి ౧కి ౮ అణాలు టోల్‌టేక్సుగుత్తేదారుకు ఇక ౮అణాలు అడ్తి ౮ కమీటి ౧ ధర్మఖర్చు ౬ అణాలనుమారు హమాలీఖర్చు [ధాన్యం] మొత్తం రూ ౧౹౩ బండికి ఖర్చు ఇది వ్యవసాయకుని లెక్కలో మినహాయింపుఅసలే ఈతాలూకాలో వర్షములు అదనుకనుగుణ్యముగ పంటలుతేద్పు అందులో ధాన్యము లకు ధరలేను. పన్నులతిక్రమించుచున్నవి

---

### భారత యువజన సంఘ పంచమ వార్షికోత్సవము

కారేపల్లి, ౨౮-౭-౪౩.

ది ౭-౧౦-౩౪ తేదీన పైసంఘముయొక్క పంచమవార్షికోత్సవము జనాబుమౌల్వీమహమ్మదు గౌసుద్దీన్ సాహెబు,బి ఏ' తహశీల్దారు తా॥యిల్లెందుగారి అధిపత్యమున జరుపబడెను సుమారురెండువందలమంది సభనలంకరించిరి ఇల్లెందు మార్వాడిసోదరులుశ్రమయనక సాదచారులైకూడ దయచేసిరి. సాయంకాలమారుగంటలకు శ్రీరామకోవుల పతాకవందనముతో కార్యక్రమమారంభింపబడెను అధ్యక్షుని ప్రారంభోపన్యాసముపిదప సంఘప్రధానకార్యదర్శి గారగు శ్రీయుత బి హీరాలాలుగారిచే సాంవత్సరిక నివేదిక విన్నవించబడెను తదనంతరము గ్రంథాలయోద్యమమును గురించి శ్రీయుతులువెంకటప్పలాచారి బి రాజారావు జి.రామకృష్ణయ్య గారలున్ను పరపతిసంఘములగురించి శ్రీయుత సి హెచ్ రాజారావుగారున్ను, స్కౌటుఉద్యమమునుగురించి శ్రీయుత హెచ్ నారాయణరావుగారును సద్గ్రంథపఠనముగురించి శ్రీయుత నే వి రాఘవరావుగారున్ను యువజనోద్యమమును గురించి శ్రీయుత పర్వాశీతారామచంద్రరావుగారును, దేహపరిశ్రమమునుగురించి శ్రీయుత జె సత్యనారాయణరావునాయుడుగారును సంఘసంస్కరణమునుగురించి శ్రీయుత కేటురామగోపాల్ గారును లలితకళలనుగురించి శ్రీయుత జి లోకనాథశర్మ గారును, నవనాగరికతనుగురించి శ్రీయుత బి నారాయణరావుగారును, ఈ మహాశయులందరు మృదుమధురముగ నుపన్యసించి సభ్యులనానందవారధిలో నోలలాడించిరి అధ్యక్షుని అంత్యోపన్యాసముపిదప అల్పాహారవినియోగ లేసిటిసాంగుతో రాత్రిపది గంటలకు కార్యక్రమము ముగింపబడియెను, [లోకనాథశర్మ]

సహాయకార్యదర్శి

---

## తృతీయాంధ్రమహాసభ

### ప్రతికూలప్రచార ము నిలచిపోవుట

తృతీయాంధ్ర మహాసభాహ్వాన సంఘాధ్యక్షులగు ఆ జీడికంటి రామారావుగారు క్రింది విధమున మాకు వ్రాయుచున్నారు —

ఖమ్మములో జరుగు తృతీయాంధ్రమహాసభ విషయమై ఈ మధ్యజరుపబడిన ప్రతికూలప్రయత్నములవల్ల సభ ఆగిపోవునని యసత్యవదంతివ్యాపించి పత్రికాముఖమున చర్చలు సాగినవి

ఈ సభకు ప్రతికూలప్రచారములను గల్పించినదాశరథి వెంకటాచార్యులు మున్నగు ప్రధాన వ్యతిరేకులే ప్రయత్నించి మరలసభాహ్వానమునంగీకరించుచు నాయాహ్వానప్రకటనకనుబంధముగ సంతకములు చేసియున్నారు వీరేగాక వీరు చేయించినప్రతికూలమహాజరీలో సంతకముచేసినవారుగూడా సభాహ్వానము నంగీకరించి సంతకములు చేసియున్నారు ఇప్పుడు ప్రతికూలప్రయత్నము పూర్తిగా ఆగిపోయినది

స్థానికవర్తకశిఖామణులుగూడ మహాసభ ఖమ్మములో జరుగుటయందు సహాయవంతులగుచు విజయప్రదముగా నిర్వహించుటకు తోడ్పాటొనరించ సంసిద్ధతనుగూడ ప్రకటించుచున్నారు, కావున మహాసభవిషయమై ప్రతికూలవదంతులు విజయముని నమ్మక చర్చను విరమించెదరుగాకయని ప్రార్థన.

---

### సెలవులేని గంజాయికై జుర్మానా

కట్టెబావుష్ముల అమ్ముకొనుచున్న లక్ష్మణదాసు రామదాసు అను బయిరాగిలమవారలవద్ద సెలవులేనిది గంజాయి ౮ తులాలు కనుపడినందున ౫౦ రూపాయల జరిమానా విధింపబడినది

---

## తృతీయాంధ్ర మహాసభ

### మరల చేరిన విరాళములు

| | | |
|---|---|---|
| ఇదివరకు ప్రకటింపబడిన చిరాళవాగానములు | | రు. ౨౨౦. |
| పెదమందు | | ౨౬ |
| మ రా శ్రీ, బొడ్డునరసింహంసాహుకారు | | ౬ |
| [గతకొల్లు పేటు రూపమున] | | |
| ,, | స్వామినూర్యనారాయణ శ్రేష్ఠిగారు | ౫ |
| ,, | బూశిపెంటయ్యగారు, హరిజనుడు | ౩ |
| , | కుక్క లచ్చంగారు హరిజనుడు | ౩ |
| ,, | యెట్టివాకకోటయ్యగారు ,, | ౩ |
| ,, | కుక్క అరాగయ్యగారు ,, | ౩ |
| ,, | గుండెసాక వేంకయ్యగారు ,, | ౩ |

మొత్తముబండీలు ౨౬

సదరు మొత్తము రా ౨౪౬

ఈగ్రామమునందింతకుపూర్వము రు౧౫౦లు[బండీలు] విరాళరూపమున వసూలయ్యెను ఇపుడువసూలైనవానితో కలిపి రు౨౯౬లు

అధిమానపూర్వకముగా విరాళములనొసగ వాగ్దానము గావించినదాతలకు కృతజ్ఞతావందనముల నర్పించుకొనుచున్నాము

జీడికంటి రామరావు పం అధ్యక్షుడు.

ఊ లక్ష్మినారాయణరావు ఉపాధ్యక్షుడు

---

## బంజరబావుల కౌల్దారుల గతియేమి!

[ హాలికుడు ]

౧. కౌల్దారు అనగా జమీందారువద్ద ఒడంబడికచేసికొని సేద్యము చేయువాడనిసర్వసాధారణార్థము, రివాల్యూషన్ ౫౭ సన్ ౧౩౦౩ ఫసలీ ప్రకారము సర్కారితో ఒడంబడికచేసుకొనినజమీందారుకుకూడా కౌల్దారని పిలువబడును. ఈ కౌల్దారమునుగురించి కరణముగారి దఫ్తరములో తఖ్తానిపాన్ ౧౨ వ్యాస నవిస్తరముగా వ్రాయబడును సన్ ౧౨౫౭ గా జిఒడంబడికప్రకారము పూర్వము చెప్పనుగొట్టె గ్రామముల నేర్పరచిన జమీందారులకుకూడా కౌల్దారులనియు మరియాగ్రామమును బంజరయనియు, ఇజారయనియు, బిల్మక్తయనియుకూడ వ్యవహారింతురు అందలు కౌల్దారులేగాని, హక్కులను ఒడంబడికలులేవు

కౌల్ అనగా అరబ్బీభాషలో ఒడంబడికయనేయు—ఇజార అనగా ఫార్సీలో జమీందారు [భూస్వామి] అనియు బంజరఅనగా హిందీలో బీడునేలయనియు అర్థము పైపదములనుండి కౌల్దారుయొక్క ఉత్పత్తియర్థము మనకిప్పుడు స్పష్టమైనది అనగా పనికిమాలినబీడు నేలను సేద్యము చేయుటకొరకు సర్కారునుండి లేక భూస్వామినుండి యొడంబడికచేసుకొనుటయే కౌలు

గష్టినిషాన్ ౫౭ ప్రకారము, బావుల పంటలు క్రొత్తగా తనస్వంతధనమునుండి మరమ్మతుచేసుకొనుటకు వటి నిరైతుల ౨౦ సంవత్సరములగుత్తే సర్కారునుండిదిసుకొనినమొదట ౧౫ యేండ్లుఖుష్కీధారాను తర్వాత ౧౫ ఏండ్లు ఆయాధారముక్రింద సేద్యమైనతరి లేక బాగాయితికి ఇన్నాడి ఖుష్కీరకముపసూలుచేసిరి, ౩౦ ఏండ్లు ముగియుటలోడనే ఆబావిక్రిందితరికి రూ ౮ లనుండి రూ ౧౫ ల వరకు బాగాయితికి రూ ౫ లనుండి రూ, ౧౦ ల వరకు వసూలుమొదలగును.

## మహాత్ముని ప్రకటనపై శ్రీనివాసశాస్త్రి గారి విమర్శ

బొంబాయి, అక్టోబరు ౪ —

హిందూ యువజనసంఘము న యం. ఆర్. జయకరు గారి అధ్యక్షతను జరిగినసభలో మహాత్ముని ప్రకటనలోని సూచనల నువిమర్శించుచు శాస్త్రిగారు ఉపన్యసించిరి

„ఎంతగొప్పవారయినను కాంగ్రెసువంటి రాజకీయసంఘమున సభ్యులవిషయమున అసాధ్యమును, అతికఠినమునునిబంధనలను విధించుట అనుచితము ఇట్టినిబంధనలు విధించుటవలన స్వరాజ్యముకొఱకు కాంగ్రెసులో చేరిపనిచేయదలచిన దేశభక్తులగు వేలకొలది యువకులకు అవకాశము లేకుండపోవును భారతదేశమునకు స్వాతంత్ర్యమునుసంపాదింపగోరు స్త్రీలును పురుషులును ఎల్లవారును కాంగ్రెసులో చేయుటకు వీలుగా నుండవలెను కానిఎవరోకొద్దిమంది వేదాంతులుమాత్రమే చేరగలిగినగానుండరాదను సముచితశాంతియుతపద్ధతులు అనుటకుబదులుగా అహింసాసత్యపద్ధతులు”అని యుండవలెనని గాంధిగారుసూచించిరి మనలోవారిలో ఎల్లవారును ఎల్లప్పుడును అహింసానిరతులుగానేయుండుట అసంభవము అటులనే ఎల్లప్పుడును సత్యమునే చెప్పుటగూడ సాధ్యపడదు మహాత్ముడు గూడ ఎల్లప్పుడును అహింసాసత్యములనే అనుసరింపజాలడు ఎల్లప్పుడును సత్యమునే చెప్పవలెననిన యావజ్జీవము మౌనవ్రతమును బూనవలసి యుండును. అదిసాధ్యము కాదు గాన నిత్యసత్యవ్రతముగూడ సాధ్యముకాదు ఇట్టి కఠిననియమములను అనుసరింపవలెననిన మనుష్యులు తమతుత్సాహమును పోవారిరని పూర్తిగా కోల్పోయి ఇక ముందెట్టి పనినిగూడ చేయజాలకపోయెదరు కావున ఇట్టి కఠిననియమములను విధించుట అనుచితము.

అందరును నూలుచందాలను చెల్లించవలెనని మహాత్ముడు చెప్పు దీనివలన కాంగ్రెసువారిలో కపటప్రవర్తనము అధికమగును

దేశమునకు స్వాతంత్ర్యమును సంపదయును కలుగునట్లు ఒకడు సేవచేయగోరినచో అతడు ఇంటకూర్చుండి నూలువడకవలెనంట యేటి వ్యాయము’

అందరును ఖద్దరుకట్టవలెనన్నదిగూడ సాధ్యము కాదని మహాత్ముడే స్పష్టపరచియున్నాడు

ఇట్టినిబంధనలను కాంగ్రెసుమహాసభవారు ఆమోదించిరనచో ఇకముందు నావంటివారు స్వరాజ్యసంపత్తి నిమిత్తము కాంగ్రెసులో చరవలెనన్నను వీలుండదు” అని శాస్త్రిగారు నుడివిరి

„శాస్త్రిగారికి అస్వస్థతగానుండినను వారుతమబాధ్యతను గుర్తించి అతిముఖ్యమగు ఈవిషయమును గూర్చి తమ అభిప్రాయమును తెలిపినందులకు నేను సంతసించుచున్నాను నేను పూర్తిగా శాస్త్రిగారితో ఏకీభవించుచున్నాను ఇతరులు కాంగ్రెసులో చేరుటకు వీలులేకుండునట్లు కాంగ్రెసు మహాసభవారట్టి కఠిననిబంధనలను నియమింపకూడదు” అని యం. ఆర్. జయకరుగారు నుడివిరి

---

### కాంగ్రెసు సంస్థానములనుగూడ గమనింపవలెను

అహమదాబాదు అక్టోబరు ౧, —

గుజరాతు కాంగ్రెసు సాంఘికవాద సంఘకార్యనిర్వాహక సంఘమువారు అనివారము సమావేశమై యీక్రింది తీర్మానములను ఆమోదించిరి —

భారతశాసనసభ ఎన్నికలలో పాల్గొనుటవలన సామ్రాజ్యముతో సమాధాన పడినట్లగునని యు, ఇందువలన ప్రజాసామాన్యమునకు ద్రోహము చేసిన వారమగుదుము గాన కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు నేషనలిస్టుపార్టీ తలపెట్టినపని అసమంజసమని సభవారు తీర్మానించిరి

ఖాందీ ముఖ్యమంత్రి యభిప్రాయ ఒకటే కావున సంస్థానప్రజలను వేరుగా భావింపకూడదని సభవారు తీర్మానించిరి

పార్టీసభ్యులు సాంఘికవాదుల గమ్యస్థానము చేరుటకే కృషిసలుపవలెనని యు, అవసరమైనచో కాంగ్రెసుసంస్థల సహకారముగూడ బడయవచ్చునని యు సభవారు తీర్మానించిరి

ఖద్దరు అభిమానులకే కాంగ్రెసు సభ్యత్వము లభించునను సవరణను కాంగ్రెసు విధానము నుండి తొలగింపవలెనని సభవారు కోరియుండిరి

సామ్యవాదమును నిషేధించుచు సభవారుగావించిన ప్రకటనను సభవారు ఖండించిరి

---

### పోలీసుస్టేషనధికారి అరెస్టు

క్రొత్త ఢిల్లీ, అక్టోబరు ౮ —

తన్ను బెదరించినందుకు గాను దొంగకేసు పెట్టుటచే అజ్మీరుజిల్లాలో ఒక పోలీసు స్టేషనధికారియగు నానక్‌చంద్ నను స్థానికపోలీసు వారరెస్టు చేసిరి. జామీనుపై అతనివిడిచిరి.

---

### అరబ్బువారికి అరబ్బులోవిద్య

హైదరాబాదులోని టీచర్సు కాలేజి పరిపాలన నివేదికను పిన్సిపాలు ప్రకటించెను దానినుండి కొన్ని ముఖ్యవిషయములు క్రింద పొందుపరచుచున్నాము

ఆ కాలేజియందు విద్యార్థులకు క్రొత్తపద్ధతి ననుసరించి గ్రంథపాఠము మొదలు ఉపధ్యాయులు చరిత్రను మున్నగు పాఠములను అరబ్బుభాషయందే బోధించుచున్నారు దానివలన కలుగు లాభాలాభములను పరిశీలన చేయుచున్నారు దానినిముందుజాగ్రత్తగా ప్రాంతమునందు కొంతవరకు నిర్ణయించుటకు వీలు కలుగవచ్చును

---

### విద్యార్థులకు నిర్బంధ సైనికవిద్య

కరాచి, అక్టోబరు ౭ —

భారతదేశమునందు ఉన్నతవిద్యాసంస్థలలో సైనికశిక్షణ ప్రవేశపెట్టుటకుగాను తీవ్రచర్య యవసరమని తెలుపుచు తన ఇడి ఇంజనీరింగు కళాశాలాధ్యక్షుడగు జి. ఎస్. గోఖ్లేగారు బొంబాయి విశ్వవిద్యాలయోపాధ్యక్షునికి లేఖ వ్రాయుచున్నారు కళాశాలవిద్యార్థులందరికిని నిర్బంధసైనికశిక్షణ ముండవలెనని ఆయన కోరుచున్నాడు

---

### విశ్వజిత్ యజ్ఞము

కలకత్తా, అక్టోబరు ౭ —

అధికక్లేశపరంపరలకు లోనైయున్న మానవకోటిని ఆశీర్వదింపుడు రక్షింపుడు అని దేవుని ప్రార్థించుటకు పై యజ్ఞమును ఘనముగ జేయుచున్నారు ఆ కార్యనిమిత్తమై ప్రోత్సాహము కూడ కలిగినది ఎట్టకేలకు యజ్ఞములో హృదయపూర్వకముగ పాల్గొనుటకు మహామహోపాధ్యాయ పండిత మర్గాచరణ్ సాంఖ్య వేదాంతతీర్థులవారు సమ్మతించిరి పనులన్నియు తమ మార్గమునందుయందే శాస్త్రోక్తముగ జరిపించుమనుమని వారు నొక్కి వక్కాణించుచున్నారు

కలకత్తాలోనున్న స్వామివిశుద్ధానందగిరిగారు యీపనిమీదనే కాశీ ప్రయాణమగుచున్నారు ఈ స్వామి అచటనుండి కలకత్తాలో యీయజ్ఞమును జయప్రదముగ చేయుటకు ఏర్పాటు చేయుచున్నారు

ఈయజ్ఞమునకై వేయిమంది బ్రాహ్మణపండితుల నేర్పరచుచున్నారు

---

### హిట్లరు హిందువు నాహ్వానించుట

చర్చి అభివృద్ధిని గూర్చి చర్చించుటకు జర్మని అధ్యక్షుడగు హిట్లరు ఆండమాను గోడియ మిషనుకు చెందిన స్వామి బి. హెచ్. బాన్ గారితో మతసంబంధమగు చర్చలు సలుపుటకొరకు వారిని ఆహ్వానించినట్లుగ తెలియుచున్నది రాబోవు నవంబరు ౨౭ తేదిన వీయుభయుల సందర్శనము జరుగవచ్చును జర్మనీలో నూతనముగ స్థాపింపబడిన రీచ్ చర్చి నభివృద్ధిగావించు సందర్భమున హిట్లరు యీ చర్చలను సలుపుటకు సంసిద్ధముగ నున్నట్లు తెలియుచున్నది,

జర్మని భారతదేశములమైత్రి ప్రచారక సంఘము యొక్క ఆహ్వానమున బెర్లిను నగరములో నవంబరు ౨౭ తేదిన స్వామి బి. హెచ్. బాన్ గారొక యుపన్యాసమొసగెదరు ఈ యుపన్యాసమునకు హిట్లరు యొక్క ముఖ్యమిత్రులు కొందరు ప్రత్యేకముగ హాజరగుదురని తెలియుచున్నది

---

### పంటఫలిత్పత్తి పరిశ్రమవృద్ధికి మార్గములు

లక్నో, అక్టోబరు ౭ —

వ్యవసాయ డైరక్టరు మిస్టర్ గారిప్రస్తుతము సెలవుమీద యింగ్లాండునందున్నారు వారిచే తయారుచేయబడిన ఫలాభివృద్ధికి, విక్రయ విధానముల గూర్చి సంయుక్తరాష్ట్రములలో పండ్ల నధికముగ పండించుట కేర్పడిబోర్డువారు చర్చించి ఆవిధానమునకు పూర్తిగ సమ్మతించిరి. ఆలనుగారు సూచించిన శ్రేష్ఠమైనపద్ధతులననుసరించి భూములకు తగ్గించిన పంటలవెఱపెంచుట, యీ పండ్లను విరివిగ ఎగుమతిచేయుటకు వీలగునట్లు లాభములను మధ్యవర్తులు పొందకుండుటకు సహాయము లుజేసినతోటలవారికే ప్రాబల్యమును ప్రోత్సాహమును కలుగును ప్రత్యేకనిధముగనుండు భూసారమును అనువగు శీతోష్ణములు ప్రపంచములో నెచ్చటను లేనివాటి యున్నను ఫలోత్పత్తియందు మనము వెనుకబడియున్నాము ఈ రాష్ట్రము పండించు తిరుగులకే జొరబడదగినవి వారు నివ్వతుము వారికందియుండుటకు నానాక పండ్లసంఘములు ప్రతిపట్టణమునందేగాక పల్లెలలో గూడ నుండవలెను ఫలాహారమువలన ఆరోగ్యాభివృద్ధి యెట్లుగలుగునో జనులకు బోధించవలసి యున్నది పండ్లను ఒకస్థలమునుండి మరియొక స్థలమునకు క్రమకాలములో తక్కువఖర్చులతో తీసుకొనిపోవుటకు పలరైలుబండ్లు మొదలగునవి కల్పింపవలెను.

---

## సంస్థాన వార్తలు

### భోపాలు పోలీసుఅధికారి దొంగదస్కతులు

#### లాహోరు హైకోర్టువారి అభిప్రాయము

ఢిల్లీలో ప్రకటింపబడు „రియాసత్” పత్రికయొక్క సంపాదకుడగు దివాన్‌సింగుపై భోపాలు నవాబుగారు చేసిన ఫిర్యాదు ౫ యేండ్లు విచారణ చేయబడినతర్వాత యీమధ్యనే (సెప్టంబరు ౨౬ వ తేదివాడు) నాగపూరులో అడిషనల్ జుడిషియల్ కమిషనరుగారు ఫిర్యాదును పునర్విచారణకై పంపివేసిరి క్రిందికోర్టువారు విధించిన ఒకసంవత్సరపు శిక్ష త్రోసివేయబడెను

ఈ ఫిర్యాదు చరిత్రవలనసంస్థానాధిపతుల నేకులు „సంస్థానాధిపతి రక్షణశాసనము”ను యేవిధముగ దుర్వినియోగము చేయుచున్నారో తెలియగలదని దివాన్‌సింగుగారు వైస్రాయికి పంపిన ఒకతంతి సందేశములో సూచించుచున్నారు.

రియాసత్ పత్రికా సంపాదకునిపై ఫిర్యాదుచేసి శిక్షవిధింపజేయుటకై భోపాలు నవాబుగారు యిప్పటికి ౫ యేండ్లక్రింద యిండియా ప్రభుత్వ రాజకీయ కార్యదర్శి యొక్క అనుమతిగోరెనట అంతకుపూర్వమే ఆ పత్రికయందు మొదట ప్రకటింపబడిన వ్యాసములందలి విషయములన్నిటిని ఖండించుచు మరియొక వ్యాసము ప్రకటింపబడెనట, అందువల్ల భోపాలు నవాబుగారు కోరిన అనుమతిని రాజకీయకార్యదర్శి నిరాకరించెనట కాని నవాబుగారు మరలమరల అనుమతికై అనేకవిధముల కోరగా ఫిర్యాదుఖర్చులు అన్నియు నవాబుగారే భరింపవలెననియు, ఇండియా ప్రభుత్వము వారికి ఏపట్టింపుగాని లేదనియు చెప్పి రాజకీయ కార్యదర్శి అనుమతి నొసంగెనట

ఇట్లు ౧౯౩౩లో ఫిర్యాదుచేయబడెను. నవాబుగారు లక్షలకొలది రూపాయలను ఖర్చుచేసి పెద్దకొలది ప్లీడర్ల నేర్పరచిరి ఢిల్లీకి ౬౦౦ మైళ్ల దూరమునందున్న నాగపూరులో ఫిర్యాదు ప్రారంభింపబడెను ఇది చాలనట్లు నవాబుగారు తమ పోలీసు యిన్స్పెక్టరు జనరలు గారిద్వారా ఢిల్లీ కోర్టులో మరియొక ఫిర్యాదు చేయించిరి ఢిల్లీ అడిషనల్ జిల్లా మేజిస్ట్రేటు గారును, లాహోరు హైకోర్టువారును భోపాలు పోలీసు యిన్స్పెక్టరు జనరలు ఫిర్యాదును సమర్థించుకొనుటకై చూపించినపత్రములపై దొంగదస్కతులు గలవనిరి ౫ యేండ్ల విచారణతర్వాత నాగపూరు హైకోర్టువారు క్రిందికోర్టువారు విధించినశిక్షను త్రోసివేసిరి

మరల మొదటినుండి విచారణయనగా తనకు లేనిపోని కష్టమనియు, కొబట్టి నవాబ్ గారికి ౫ యేండ్లక్రిందట ఇవ్వబడిన అనుమతిని రద్దుచేయవలసినదనియు దివాన్‌సింగు వైస్రాయిని ప్రార్థించుచున్నాడు

ఈసందర్భమున „ప్రస్తుత ఇండియా పత్రిక” ఒక జవాబుగలేఖలో నవాబుగారిని, మీకు రావలసిన దానికంటె యెక్కువ అంకితకల్గినది మార్పుచెందినను కేసును ఉపసంహరించుకొనవచ్చును . „మీరట్లు చేయుగలరా?” అని అడుగుచున్నది

---

### కొచ్చిను మహారాజు తిరువాన్కూరు ప్రభువుచే సత్కరింపబడుట

అక్టోబరు ౨౪ వ తేదినాడు ఉదయము కొచ్చినుమహారాజుగారు తిరువనంతపురములో ప్రత్యేకముగు నొకరైలుబండిలో తిరువాన్కూరు రాజ్యమునందలి అనువనంతపురమునకు దిగిరి తిరువాన్కూరు మహారాజుగారును తదితర సంస్థానాధికారులును వచ్చి కొచ్చినుప్రభువుగారిని స్వాగతించిరి రైల్వేస్టేషను అత్యంతవైభవముగ అలంకరింపబడెను అధికారులతో పరిచయము గలిగినతర్వాతయిద్దరు మహారాజులును జనుల సంతోషధ్వనులమధ్య నాగస్వరములవాదనలతో విడిదియైన సరాజభవనమునకు పోయిరి

---

### “ఇస్లాము”కు నిర్బంధము

కాశ్మీరసంస్థానమునందు కాశ్మీరుజిల్లా మేజిస్ట్రేటు „ఇస్లాం”పత్రిక యొక్క సంపాదకునిపైకి ఏమతస్థులకు గాని కోపము కల్గించు వ్రాతలను వ్రాయరాదను నోటీసును అందజేసినారు పార్టీలకు కోపము కలిగించు వ్రాతలను వ్రాయగూడదనియు, ఈ పద్యాసముల నిమాపవలెనని పార్టీ అబ్దుల్లా వకీలుగారికి నోటీసు అందజేయబడినది.

## మైసూరు రైతులకు మాఫీలు

ఈసంవత్సరము యొక్క అఖరువరకు మైసూరు వ్యవసాయకులు కట్టవలసిన శిస్తులలో మరికొంతభాగము మాఫీ యొసగబడినది. వ్యవసాయకుల కష్టనివారణ మార్గములను గూర్చి విచారించుటకై నియోజింపబడిన కమిటీయొక్క నివేదిక రాగానే రైతులకు శాశ్వతమైన మాఫీలు యేర్పాటు చేయబడును.

### గడ్డినుండి కాగితము

తిరువాన్కూరు ప్రభుత్వమువారు తమ రాష్ట్రమందలి గడ్డినంతయు ఉపయోగించు కాగితముతయారుచేయుటకుపనికివచ్చు పల్ప అనువస్తువుతయారుచేయించుటకై ఆలోచించుచున్నారు. తిరువాన్కూరు రాజ్యములో మొత్తముమీదసంవత్సరమునకు ౩౦,౦౦౦ టన్నులు గడ్డియగును. దీనినుండిగడ్డిని తయారుచేయుటకుయంత్రమునునడిపించుటకు పెరియారునదినుండి చాలినంతవిద్యుచ్ఛక్తి సప్లయిఅగును. సంవత్సరముపొడవునను సప్లయిఅగుచుండును.

### రేవా సంస్థానమునకు శాసనసభ

రేవా అక్టోబరు ౬ —

రేవా మహారాజాగారి చేవ్రాలుక్రింద ఒక ప్రకటనగావింపబడెను. దానివలన రేవాసంస్థానమందలి ప్రతి తహశీలు, పురపాలక, ప్రత్యేక నియోజకముల యొక్క ౩౨ సభ్యులుగల సంస్థానసంఘము (రాజపరిషత్తు) ను స్థాపించినట్లు తెలియుచున్నది. దశరాపండుగలలో సంఘ (పరిషత్) సమావేశము అక్టోబరు ౨౩ మొదలు ౨౭వ తేదివరకు జరుగును. సంస్థానముయొక్క శ్రేయోదాయకమయిన విషయములన్నింటినీ చర్చించును.

అసంఘముయొక్క జీవితకాలము ఒక సంవత్సరమని నిర్ణయింపబడినది.

## వింతలు, విశేషములు

### పులులటక్కు

పులుల తెలివిచూచినారా? బర్రెలకు అనుమానము కల్గించక వాటినితమగుహలలోనికి ఆకర్షించుటకై అనేకొన్ని వేళల బర్రెలు అరచునట్లు అరచునట ఒక్కొక్కప్పుడు అవి బర్రెలవలె దుమ్మురేపునట.

### బిగువుఫ్రాకులకై స్త్రీలకు ఆజ్ఞ

జర్మని హిట్లరుగారి చేతిక్రిందికి వచ్చినదిమొదలుకొని ఆరాజ్యమందు మార్పులు అసాధారణవేగముతో జరుగుచున్నవి. జర్మని తనబ్రతుకుకై యితరదేశముల పై నాధారపడక స్వతంత్రముగ నుండవలెననియు, అంతేకాక అది యితరదేశములను తనరాజ్యములో చేర్చుకొని సార్వభౌమరాజధానిగ నుండవలెననియు హిట్లరుగారియెత్తు. తాను ఇందుకై చేయుపనులకు జర్మనియందైనను యితరులెవరు అడ్డు తగులకుండునట్లు, హిట్లరు ప్రతికులపై తనపక్షమువారికి కఠినమైననిగ్రహిని అజ్ఞాపించినాడు. ఇతరరాజకీయపక్షీయులను ప్రభుత్వోద్యోగములనుండి తొలగించినాడు. జర్మనికి స్వతంత్రమై సంపూర్ణమైన సేనయుండ నిది కష్టము గలదని గ్రహించి జర్మనియసేనలో పనిచేయుటకు చాలినంతమంది జర్మనియులు లేరనిజూచి, క్రొత్త గాజాయులను పుట్టించుటకై పెండ్లి కానివారు ప్రభుత్వోద్యోగములందు ఉండరాదని శాసించినాడు. ఇట్టి నిర్బంధవివాహాజ్ఞ మనకు విచిత్రమేగదా.

ఇంతకంటె విచిత్రతరమైన యాజ్ఞ యీమధ్యనే చేయబడెను. స్త్రీలందరు బిగువుఫ్రాకులే ధరించవలెనట. ఇటువంటిస్త్రీలఫ్యాషనను సంబంధించినట్టి సూచనలను చేయుటకై హిట్లరుగారి నాజీముపక్షమువారిచే „నాజీఫ్యాషన్‌బీరో" అనునదొకటి స్థాపింపబడెను. ఇక ఈఫ్యాషన్లను సంబంధించిన అధికారిశాఖయొక్కటిగల ఆ బ్యూరో నాజీంపోతెజెంగుఅనునతడు బిగువుఫ్రాకులను ధరించవలసినదను సూచనమొదట „నాజీఫ్యాషన్ బీరో" వారు చేసిరిగాని జర్మని స్త్రీలువినలేదు, ఏలననగా వారికి అసంఘముమీద ఏలకో యువగింపుతుండెను. కాని యిపుడు ప్రభుత్వాధికారియగు పోతెజెంగుగారే అనూచనను అజ్ఞగా జారీచేయుటచే స్త్రీలు తలకొలదిగ బిగువుఫ్రాకులను తెప్పించుకొనుచున్నారు.

ఇంతకు ఈ బిగువుఫ్రాకుల రహస్యమేమనగా, ఈ ఫ్రాకులు తయారుచేయుటలో తక్కువపత్తి నుపయోగించి కొద్దిగుడ్డను గూర్చినచాలును. దీనివల్ల విదేశములనుండి మరసముగా చాలినంతకంటె యెక్కువపత్తిని తెప్పించుట నిషేధింపబడినది. ఫ్రాకులు తయారుచేయువారికి అనవసరముగా దేశీయ ద్రవ్యమును వ్యర్థముచేయరాదని చెప్పుచు పోతెజెంగుగారు బిగువుఫ్రాకులవల్ల స్త్రీల సౌకుమార్యము వృద్ధియగునని చెప్పిరి. సెబాస్, బలేయుక్తి!

### కుమారుని దేవునకు సమర్పించుట

లునిపూరులో నొక దేవాలయమున్నది. అచట నొక మహంతుకలడు. అయిదేండ్లక్రితమొకనాడు ఒక కార్మికుడు దేవాలయముకడకువచ్చి ఏడ్వసాగెను. ఏలఏడ్చెదవని మహంతుఅడుగగా, „నాకిద్దరుకుమార్తెలుమాత్రమేయుండిరి కొడుకులులేరు, వారిద్దరునుగూడ మృతినొందిరి" అని అతడు చెప్పెను. నీకు కొడుకుకలుగునని మహంతుచెప్పెను. నాకు కొడుకుపుట్టినచో దేవునకిచ్చివేసెదనని అతడు మ్రొక్కుకొనెను. తరువాత వతనికిద్దరు కొడుకులుపుట్టిరి. శ్రీకృష్ణజన్మాష్టమినాడతడు నాలుగేండ్ల ఈడుగల పెద్దకొడుకు దేవాలయమునకు తీసుకొనివచ్చి మహంతునకు వశపరచి తానుమ్రొక్కు చెల్లించితినని ఆపిల్లవాని నిపుడు మహంతు పెంచుచున్నాడు.

* * * *

### ప్రార్థనవలన వ్యాధి కుదురుట

లండనులో చార్లింగ క్రాసు హాస్పిటలులో నర్సుగానున్న ఫీలప్ యిమ్మనుగారిటుల తెలిపిరి.

ఒకనాడు ఒకడు వైద్యశాలకువచ్చెను. అతడు ప్రబల వ్యాధివలన బాధపడుచుండెను. ఒక గొప్పసర్జను అతనిని పరీక్ష చేసి శస్త్రచికిత్స జరుగకతప్పదనెను. మరునాడతని భార్యవచ్చినది. „నిన్న రాత్రి నాభర్తకు శస్త్రచికిత్స చేయుచుండగా నతడు చనిపోయినట్లు నాకు కలవచ్చినది గాన శస్త్రచికిత్సచేసిన నాభర్త బ్రతుకడని నాకు భయముగానున్నది." అని ఆమె నాతో చెప్పెను. నేను ధైర్యముచెప్పితిగాని ఆమెకు నమ్మకముకలుగలేదు. ఆమె వెళ్ళిపోయినది. శస్త్రచికిత్స జరుగవలసినరోజున ఆమెభర్త నిర్ణయింపబడినవేళకు రెండు గంటలు ముందుగనే హాస్పిటలుకు వచ్చెను. „నా ప్రక్కలోనుండిన ఆకంతి అదృశ్యముగాపోయినది" అని అతడనెను. అతనిని ఏక్సురేపరీక్షచేయగా అది పూర్తిగాపోయినది. ఇక శస్త్రచికిత్స అవసరములేదని సర్జను తెలిపెను. అది యెటులపోయినదని నేనతనినడిగితిని. „నిన్నరాత్రి ౧౦ గంటలకు నేనునిద్రపోతిని. నేడు తెల్లవారుజామున నిద్రలేచిచూడగా నాభార్య నాగదిలోలేదు. నేను మేడదిగి క్రిందకువెళ్లగా హాలులో నాభార్య మోకరిల్లబడి భగవంతుని ప్రార్థించుచుండెను. అంతకంటె మరేమియు జరుగలేదు. అదృశ్యముగా నాకంతపోయినది" అని నాకతడు తెలిపెను. అనియిమ్మనుగారు తెలిపిరి.

### ఆవు శివలింగమునకు పాలతో అభిషేకము చేయుట

బీహారులో చారా అను గ్రామమునకు వెలుపల శిథిలమైన దేవాలయమున్నది. దానిలో నొక శివలింగమున్నది. ప్రతిదినమునను ఆ లింగముపైన పాలుకనబడుచుండెను. ఎవడో భక్తుడు తెల్లవారుజామున రహస్యముగా నభిషేకముచేయుచున్నాడని గ్రామస్థులనుకొని పరీక్షచేసిరి. ఒకఆవు తెల్లవారుజామున నచటకివచ్చి ఆ లింగముపైని తనపొదుగులోనిపాలను కురిపించుచుండగా వారుచూచిరి.

## మహాచిత్రము

### విన్నారా, కనుగొన్నారా, తెలుసుకున్నారా?

ప్రపంచమంతయు స్త్రీలకులోనువైనది. ప్రతిజీవునికి సామాన్యముగా మతి [బుద్ధి] అనే స్త్రీ జతయైనది. మంచివానికి సుమతి అనేస్త్రీ చెడ్డవానికి దుర్మతి అనేస్త్రీ యీలోకమున వెంటనంటినది. ఇట్టి స్త్రీలసాంగత్యముతో సుస్థితి దుస్థితి అనే యింక యిద్దరుస్త్రీలు కలిగిరి. వీరిసహవాసము వదలించుకొందమని ప్రయత్నించ ఆశా యాచనా అనే యిద్దరుస్త్రీలు విడవరైరి. దేశాటనముచే కాలముపుచ్చుదమా శక్తి అనే స్త్రీ వుండేతీరవలెను. పండితులతో భాషించుదమా వాక్ అనేస్త్రీలేనిదికాదు. పండితుననిపించుకుందమా విద్యా అనే స్త్రీకావలయును. రాజులనుగాని ధనికులనుగాని స్తోత్రముచేతమా కవితా అనే స్త్రీలేనిదికాదు. కొట్టిగొట్టి కృషియొనరించదమా ధృతిముష్టి పుష్టి అనేస్త్రీలు లేనిదిజరగదు. దిగంతములకు ప్రఖ్యాతిజెందుదమా ప్రసిద్ధి, కీర్తి, ప్రతిష్ఠా అనే స్త్రీలను, వ్యాపారముచేయుదమా సిరియా లేక శ్రీ యనుస్త్రీయును చేరకొనిజీవింతమా భూమి అనేస్త్రీయును కావలయును. ఆరోగ్యాభివృద్ధి యిష్టమనిన దేవతలతో కలిసికొందమా దేవతా స్త్రీయాం అని వారలుస్త్రీలేగాన నైష్ఠికబ్రహ్మచారిగానుండిన గురువృత్తి అనేస్త్రీవిద్యము గృహస్థునకు భార్య అనేస్త్రీతప్పదాయెకదా. ఋషియగుదమంటె తపశ్శక్తి అనే స్త్రీయుండవలయును. అన్నిటికి సన్యాసముతీసుకుందమా విరక్తి అనేస్త్రీ తొంగిచూచును. దేశాంతరము వెళ్లుదమాలో కాంతరముచేరుదమాయనిన ప్రకృతిఅనేస్త్రీవిడవదు. ఏప్రయత్నములేక యుండదమా క్షుత్ పిపాసా నిద్రా అనేస్త్రీలు విడువరు. ఇచ్ఛాప్రకారము వర్తించుదమా ఇచ్ఛా అనేస్త్రీ హస్తావలంబనముకావలయును. అంతవెంట దుర్గతి అనేస్త్రీ ఆతిథ్యమునివ్వటూనినది. ఇట్లు పరిపరివిధముల యేమిరాగలదని చింతచేయ గతి చింతా అనేస్త్రీలు వెనకనుండనిలిచిరి. ఛీ యని విసుకుబుట్టి చచ్చెదమన్న చితా అనే స్త్రీ అక్కడకూడా సిద్ధము. ముక్తినిపొందుదమన్న ముక్తికూడా స్త్రీయే. అబ్బయొ యిదేమిరా ఇట్లాస్త్రీలయొక్కదచూచితెలక్కడనే సిద్ధము.

ఇందుకుకారణము నేను (జీవుడు) పురుషుడనుగాన స్త్రీలబాధతప్పదు. కనుక పరబ్రహ్మమును ఆశ్రయింతము. అతని పరబ్రహ్మ నపుంసకుడు. అక్కడస్త్రీలబాధవుండదను బాగివున్నది. పురుషుడనై (జీవుడు) నేను స్త్రీలస్వాధీనమైనాడను అపకీర్తిని సంభావితస్యచాకీర్తి ర్మరణాదతిరిచ్యతే అనురీతిపొందుట యుక్తముకాదు న స్త్రీ నషండో న పుమాన్ న జంతుః యనురీతి నిలచెదము.

ఇట్లుండి ఆ పరబ్రహ్మనుధ్యానించి ఆయనతోకూడా వుండి ఆనందానుభవముచేసెద ఇక్కడ మరస్త్రీబాధలేనట్లున్నది. హా హా ఓయబ్బలాలో, ఓయమ్మలాలో, మునిగె మునిగె ఇంకేమున్నది. రమారమణగోవిందా గోవింద ఎక్కడపోదు ఏమిచయును నారాయణ గోవింద ముకుంద నాను దేవ హారి హారి కృష్ణ కృష్ణ అనవుంసకుడైన పరబ్రహ్మకూడా భక్తి ప్రపత్తి అనేస్త్రీలకులోనువైనాడు. ఇంకేమున్నది. ఇంతమాత్రమేకాదండోయి అయిద్దరుస్త్రీలలో యెవరినైనా ఆశ్రయించి వారిద్వారా తనదగ్గరకు రమ్మంటాడు. తానాతే మెడబట్ట తనపాలిమోరదాటేవరకు పెట్టవేస్తాడు. అంతో యింతో కుంతీపుత్రులకు రాజ్యములేదన్నట్లు యెక్కడికిపోయిన స్త్రీలబాధఎడబదాయె. కాని యింకేమిచయువలె వీరిలోనే బాగున్నవారిని ఆశ్రయించుదము. అనిచూడబోవ పై అందరుస్త్రీలు చెడ్డవరలే. కాని భక్తి ప్రపత్తి అనేస్త్రీలు మంచివారు. పరబ్రహ్మానందమును కలుగజేసేవారు వీరిలోకూడా భక్తి అనేస్త్రీ చెడ్డదే. బాధలపెట్ట బహూనాం జన్మనామంతే అనేకజన్మములముగింపులో పరబ్రహ్మానందానుభవమును యిమ్మనవద. కొందరికి సాధ్యమేకానిదగన. ప్రపత్తి నామస్త్రీ పరమానులభమై చిన్న పెద్దలనిగాని స్త్రీలు పురుషులనిగాన జాలనితులనుగానిచూచి పక్షపాతములేక తలచినప్పుడే తలక్రాలన్నట్లు సకలసిద్ధముగానున్న ప్రపత్తి అచార్యద్వారా పావిష్టః శతృత బంధుశ్చ పుండరీకశ్చ పుణ్యశ్చత్ ఆచార్య వర్తియాముక్తా తస్మాదాచార్య అభిమతేః మాహాత్మ్యడవని భయమెందుకు పుణ్యాత్ముడవని గర్వించక ఆశ్రయించి పరబ్రహ్మతోకూడావుండి అవిచ్ఛిన్నతుల [ముగింపులేనిముఖములు] లేని ఆయతిశయమైనయానందమును సర్వజీవులు సుఖముగాయనుభవింతురుగాక.

ఇట్లు
తిరుమల బుక్కపట్నం
జాతీకవిద్వన్మణి వెంకటాచార్యులు
అమరచింతాశ్మకూరు సంస్థానము

### కలలో నడుచుట

పాట్నా, అక్టోబరు ౪ —

బి. ఎన్. కాలేజి కారిడార్‌లో పడుకొనినలలో లేచి యొక బాలుడిటునటు తూగుచుమరియొక బాలుని ప్రక్కనిదగూలబడెను.

చెయ్యంతయు నెత్తురుమయముగా నుండెను. అతని మేల్కొల్పి ఏమనిఅడుగగా పాముకరచెనని అతడుచెప్పెను. నిద్రలో నడుమవ్యాధి అబాలునికి కలదని తరువాత తెలిసెను. పాముకరచినమాట అబద్ధమనియు, క్రిందపడుటలో కిటికీ అద్దపుతలుపు బ్రద్దలై చేతిక్రుచ్చుకొనెనని తెలియవచ్చెను.

## ప్రకటన.

యిందుమూలముగా మీకు తెలియజేయునది యేమనగా జె. సత్యనారాయణగారు, స్పెషల్ రిప్రజెంటేటివ్, సికింద్రాబాద్. వారిని కంపెనీ సెర్విసెస్‌నుంచి ౧౯-౭-౩౪ నుంచి తీసివేయడమైనది గనుక కంపెనీ సంబంధమైన వ్యవహారములు వారితో జరుపుటగాని, కంపెనీ సంబంధమైన ద్రవ్యము వారికి యిచ్చుటకాని చేయకూడదు.

బి. నరసింహం,
మేనేజరు.

---

REG. No N. 45

Reg. No. M. 2185


STAMP

Printed and published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K. Balakrishna Reddy